ఓమ్.

చిత్రనీతియను

# విటకంఠపాశము.

ఇది

గోదావరి మండల సఖినేటిపల్లి నివాసులగు

శ్రీయుత రుద్రరాజు పద్మరాజుగారి పుత్రుఁడు

వేంకటరామరాజుచే

విరచితము.

---

శ్రీ సుదర్శనీ పత్రికాధిపతులగు

బ్రహ్మశ్రీ కస్తూరి శివశంకర కవిగారిచే

పరిష్కృతము.

శ్రీ సుదర్శనీ ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

శ్రీ.

చిత్రనీతియను

# విటకంఠపాశము.

ఇది

మద్రిరాజు వేంకట్రామరాజుచే

రచియింపఁబడెను.

శ్రీ సుదర్శని ముద్రాక్షరశాలయందు ముద్రింపించి
ప్రకటింపఁబడెను.

నరసాపురము.

1918.

చిత్తనిరోయనః

విటకంఠపాశము.



ఉ. శ్రీరమణీ మణీ విమల
చిత్తసరోజ విహార భృంగుడున్
నారద తుంబురాది ముని
నాయక గాన రసాభి తుష్టుడౌ
నీరజనాభు చారుపద
నీరజ యుగ్మము నందు నీవు సం
చారము చేసి పాపముల
నయ్యన వీడఁగఁ బూను చిత్తమా.

చ. కులములలోనఁ జూడఁ గదు
కూడనిదా కులమందుఁ బుట్టు వా
వెలచెలి పాద యుగ్మమును
వేడి గ్రహించిన పుణ్యమబ్బునా?
యిల నిరుపద్రవం బగుచు
నింపగు శోకము లుండ హేయ

పలలమ్మా దిక్కుకీర్తి నెల
భామల గూడుట యేల చిత్తమా

ఉ. పాడగు నెల్ల సొమ్ములును,
బంధువు లెల్లరు నింట నేతు కీ
జాడ లెఱింగనేని ప్రియ
జాయయుగుందునుతల్లిదండ్రులుఁ
గాడిద రీతి నెంతయు చెలి,
కాంద్రను పోషణ చేయఁజూతు
పాడు గుణంబుమాను నెల,
భామలఁ గోరకు వెర్రి చిత్తమా!

ఉ. ఎందరొ మాయలాడులు మ
రెందరినో విటకాండ్రమున్ను మో
హాంధులఁ జేసివైచి ధన
మంతయుఁ లాగి పకీర్లఁ జేయుటల్
గ్రంథములందుఁ జూడ వొకో
కాని గుణంబులుఁ గల్గు నిట్టి కా
మాంధుల దారిఁబోయి మన
మా యపకీర్తి పాలుగాకుమా!

ఉ. రంగగు చీర కుచ్చెళులు,
రమ్య పదంబులఁ జిందులాడ వేఁ
బంగరు హార పంక్తి చను,
బంతులపై నటియింప నొక్క వా
రాంగన నాట్య మాడఁగను,
నయ్యది కన్గొని యుబ్బఁ బోకుమీ
భంగము గల్గు నట్టి వెల
భామలఁ గూడిన వెర్రి చిత్తమా!

చ. సరసులు బావగారు కడు
చాతురి గల్గిన వారటంచుఁ దా
సరసకుఁ జేరి మోసమున
చక్కఁగ మాటలఁ జెప్పినంత నే
మురియుచుఁ దాని మార్గమునఁ
బోయినఁ నింద ఘటిల్లి వ్యాప్తమై
పరువు నశింపఁ జేయు వెల
భామల గూడిన వెర్రి చిత్తమా!

ఛ. మదనుని కేళి నేలుమని, (చూసి
మాయల మాటలు కొన్ని వ్రాయు

ముదమున వారకాంత యొక,
ముద్దుల పత్రిక వ్రాయఁ బొంగి న
మ్మ్రదమునఁ దానిఁ గోరుటలు,
మానుము పెద్దలు నిందఁ జేతు రా
పద ఘటియిల్లు గాన వెల
భామలఁ గూడకు వెర్రి చిత్తమా!

ఉ. తల్లియుఁ దండ్రియున్ కులము
ధ్వంసము చేసెడు శుంఠ బుట్టె నం
చెల్లపుడున్ మదిన్ పగవ
నింటను నర్థశరీర గుండ, వీ
డల్లరి వాఁ డటంచు బుధు
లందరు మోహమున నుమ్మివైవ నీ
వల్ల ధనాంగనా కుచము
లంటఁగఁ జూచెద వేలఁ జిత్తమా!

క. ధనకాంత లెంద రైనను
మనకాంతకు సాటిరారు మహిలోఁ జూడన్
జనకుమ నా మనవిని విని
మనమా వెలకాంతపైకి మన్నింతు నినున్.

చ. ధనముఁ గడించు టే పరమ,
ధర్మముగాని విటాళి నెప్పుడున్
మనమున నిండు ప్రేమ వెల,
మానినిఁ జూడదు ప్రేమగల్గి న
ట్లు నటనఁ జేసి మాయలకు
లోనగు నట్టులఁ జేసి ద్రవ్య మం
తను గొని క్రూరరుగ్రతల
దానికి మారిడి త్రోసివేయు నీ
పనులకుఁ జిక్కి నీవు వెల
భామలఁ గూడకు వెర్రి చిత్తమా!

ఉ. కామ నిభాంగయంచు వగ
కాడ యటంచును వేశ్య బిల్వఁగా
ప్రేమ జనించె నా పయిని
పీన పయోధరి కంచు మెచ్చి యా
భామనుఁ గూడి యుండెదవు
వార వధూటికిఁ బ్రేమ సున్న యీ
పామర బుద్ధి మాని వెల
భామలఁ గూడకు వెర్రి చిత్తమా!
ఉ. వీథినిఁ బోవుచోఁ బిలచి,

పీఁటమునిచ్చి ప్రియోక్తిమీరబల్
గాథలు చెప్పి గాఢముగ
కామము పుట్టఁగ జేసి పిమ్మటన్
నీధనమెల్ల భామలకు
నేమపుమీరగ లాగు నందుపై
బాధలు గల్గుగాన వెల
భామలఁ గూడకు వెర్రి చిత్రమా!

ఉ. నృత్యము చేయుచున్ వలపు
నేర్పుచు బూతులు కొన్ని పాడుచున్
యత్యధికంబుగా నభిన
యంబును సల్పఁగ దానిఁ జూచినన్
సత్యముఁగాగ రమ్మనెను
సారసనేత్రి యటంచుఁ దాని సాం
గత్యముఁ గోరి నీవు వలు
కష్టపు త్రోవలఁ బోకు చిత్రమా!

ఉ. బాసలు పెక్కు చేసెదని
భావమునంగను సంతసించి వే
శ్యాసరసీరుహాక్షి నెపు.

దైనను నన్నుగ వచ్చునే సదా
మోసముఁజేసి యెల్ల ధన
మున్గొని వీథికిఁ గెంటునాడు మున్
జేసిన బాస లూడవటు
చేరకు చిక్కులు గల్గు చిత్రమా !

చ. బ్రతికిన నాల్గునాళ్లు గుణ
వంతుఁ డితండని యెల్లవారలున్
స్తుతి యొసరింపఁగా యశము
తోరముగా గడియింపమాని స
మ్మతి మెయి వారకామినుల
మాయల మాటల నమ్మ గోరెదా
యతివలు మోసకత్తెలు సు
మా! మనమా! మరి నమ్మబోకుమా

ఉ. మానిని దారకున్ దివిజ
మానిని రంభకు నిగ్గుఁ గూర్చు సిం
గారము గల్గు నొక్క వెల
కామిని యొక్కెడ నున్నదన్న నా
దారినె పట్టి పోయెదవు

వాఁడడి నొందిపోదు మన
మా! వెలకాంతల జేరబోకుమా.

ఉ. తుంటరివై సతంబు ధన
తోయరుహాక్షులఁ గోరుటేల? వా
ల్గంటి కులాంగనా మణికి
గల్గిన సొంపగు సంగ సైఖ్యము
ల్కంటెను వారకామినికిఁ
గల్గిన యందము లెచ్చులుండునే?
యింటను గల్గుదాని కల
నేనియుఁ బీడకు వెట్టి చిత్తమా!

ఉ. ఒక్కని తోడఁబల్కి యిఁక
నొక్కనికిన్ మరి బాస యిచ్చియిం
కొక్కనివల్ల డబ్బుఁ గొని
యొక్కనికిన్ కను సన్న జేసి తా
నొక్కని యింటికేగుచు మ
రొక్కనికిన్ చెయి వీచి యందువై
నొక్కని ముద్దు పెట్టుకొని
యొక్కనికిన్ పయిటోరఁజేసి వే
ఱొక్కనితోడఁ గూడు, వల

పుండుసె వేశ్యకు వెఱ్ఱి చిత్తమా !

౫. మారసతీసమాన సుకు
మార శరీరను వేశ్య కాంతనే
గోరితి మీ కదేటికని
కూడ దటంచును చెప్పు పెద్దలన్
దూరి ధనాంగనన్ గవయఁ
దొల్లిఁటి మిండఁడు చూచెనేని క్రై
జాపను దూసి ని న్నొడిచి
చంపును మాటికి తప్పబోవ దా
దారుణ కర్మమేల వెల
తన్వుల గోరకు వెఱ్ఱి చిత్తమా !

౬. చుక్కల రాయనిన్ దెగడు
సోయగఁపున్ మొగమున్న తేనెలన్
గ్రిక్కిడి మోవియున్న సుమ
కందుక యుగ్మముఁ గేలిసేయుబల్
చక్కని గుబ్బలున్న మెయి (యా
చాయలు హేమము మీరియున్న
ముఁగ్రిక్కిడి వేశ్య కాంతలకు
మోహము జెందకు వెఱ్ఱిచిత్తమా!

చ. పడుచు దటంచు గీతములు
బాడు నటంచును కైత చక్కగా
నుడువు నటంచు గోవనిత
నుం గని గాటపు మైత్రిసల్పి యా
గడవున సొమ్ములెల్ల నిడి
గౌరవ మెల్లను గంగఁగల్పి యా
పడఁతిని గూడియుండి పలు
బాముల జిక్కకు వెర్రి చిత్తమా !

చ. వెలచెలియన్ గనుంగొని వి
వేకము వీడి సదా విలాసచే
ష్టలికెదు దానిఁగూడి యది
కూడదులోకులు మెత్తురొక్కొ?లో
కుల నటులుండనిమ్ము కడు
క్రూర దురంతపుఁ బన్నగంబుతో
చెలిమి యొనర్చినట్లు వెల
చేడెను గోరకు వెర్రి చిత్తమా !

ఉ. తుంటరి వారితోఁ గలసి
తుంటరిగాఁ దిరుగాడు చుండఁగా
కొంటె తనంబునన్ బడుపు

గొమ్ముల యిండ్లకుఁ దార్చి నింద వె
న్నంటఁగ జేసెదూ పయిని
నన్నివిధంబుల గేలిసేతురా
దంటుసిపాయి లందఱకయి
దబ్బర తోవిపలఁ బోకు చిత్తమా!

చ. జనకుఁడు దిట్టనిమ్ము ప్రియ
జాయయుఁగుందినఁగుందనిమ్మునా
ధనమును బోవనిమ్ము యల
దానిఁ గూడక మానసంచు నీ
వనుకొని యా ధనాంగన గృ
హమ్మున కేగి విశేషమౌ ధనం
బును వెల కాంతకిచ్చి కుల
మున్ జెడుమాటకుబాలుఁజేసి యా
వెనుకను బిచ్చ మెత్తుకొని
వీధుల దిరిమ్మరనేల ? చిత్తమా !

చ. పడవు చెలిన్ దగులొ్కని య
పారముగా ధనమిచ్చి యవ్వియున్
గడచిన వెన్క యింటఁ గుల
కామిని కుంచిన యెల్లహేమఁపుం

దొడవుల నిచ్చి పిమ్మటను
తొల్లి గడించిన మాస్యమమ్మి యా
పడఁతికి ధారబోసి యది
వాకిటికిన్ పడ గెంటునాడు హా
వెడగుమతిన్ జరించితి వి
వేకము వీఁడితీ నంచు యేడ్చెదే ?
వడివడి నేగి నీవు వెల
భామలఁ గూడకు వెఱ్ఱి చిత్తమా !

చ. మిలమిలలాడు చేలయును
మేలగు బంగరు భూషణంబులున్
తళతళలాడు సైకయును
దాలిచి వార మృగాక్షి బోవుచో
పులుసునుఁ దిన్న మర్కటము
పోలిక నూరెద వేల వారకో
మలి మధులి ప్తఖడ్గము సు
మా! మనమా! మది వెఱ్ఱిమానుమా!

ఉ. గుమ్మము చెంత నొక్క వెల
కోమలి నిల్చి యపాంగ దృష్టిచే
రమ్మని బిల్చి నంతటనె

రంజిలి దానినిఁ గూడ నెంచి వే
గమ్మగ నేగఁబోకు కుల
కామిని విన్న విచారమొందు పా
పమ్ము ఘటిల్లు దాన వెల
భామల గూడకు వెర్రి చిత్తమా!

ఉ. న్యాయ మటయ్య నీకు కుసు
మాయుధు బాణ పరంపరాగ్నికిన్
గాయము నిల్పఁజాల నిఁక
కాముని కేళిని నేలు మంచు ని
న్యాయనటంచు వ్యర్థమగు
బాసలు జేసిన వారకామినీ
మాయలలోనఁ జిక్కి పలు
మారు శ్రమం పడఁబోకు చిత్తమా!

ఉ. మారసమానరూప యను
మాన మదేలను నేను నీసతిన్
గూరిమి తోడఁ జూడు మిఁకఁ
గోరను వేరొక వాని నంచు యా
వారవధూటి మిథ్యలగు
బాసలు చేసిన నమ్మి పొంగి తూ

భారము మోయనేల వెల
భామల గోరకు వెర్రి చిత్తమా !

చ. వారి వధూటులన్ దగిలి
పాడయి పోయిరి యెందరో జనుల్
దారుత యెంతగల్గిన య
ధ్వాస్థితి నుండఁగ జాలినారె యె
వ్వారును నిల్వజాల రిఁక
వార వధూటికి ముందుగా నమ
స్కారము జేసి నీకుఁగల
గౌరవ మీఁగకు వెర్రి చిత్తమా !

చ. కనకపు మెట్టపైన మన
కాఁపుర మైన శనిగ్రహంబు చా
ద్పున నది యంతయున్ పడుపుఁ
బోటి హరించె యనంతరంబు తా
గానుమఁని చిప్ప కర్రయును
గూరిచి బిచ్చము నెత్తఁ బంపు నీ
పనిపయి కోర్కె మాను వెల
భామల గూడకు వెర్రి చిత్తమా !

చ. వయఁడొక కామినిన్ గలసి

వర్తిలుచుండె నటంచు విన్న నీ
పరసతియందు ప్రేమ తన
పక్షమునం గలుగంగ లేదు నా
వరుస కటంచు రోసి కుల
వారిజలోచన పాదు నాతిలో
నురుకఁగఁ బోవునో క్కోమది
నూహయొనర్పుము వెర్రి చిత్తమా

ఉ. జారులతోడ సఖ్యమును
సల్పి ధనాంగన చెల్మిఁబొంది యా
క్రూరులతోడ చోరత న
కుంఠిత రీతిని సంచరింపగా
చోరుఁడు తుంట రీతఁ డని
చూచిన వారలు దిట్టు దీనికిన్
గారణ మా వెలాంగనయె
గాదె తలంపఁగ వెర్రి చిత్తమా !

చ. సరస మెఱింగి సట్టి నెర
జాణ వయ్యారి యనేక రీతులన్
మరుని కళా ప్రపంచమున
మార్గముఁ జూపెడు మద్దుగుమ్మ నీ

వరుగు మటంచు తుంటరి వి
టూళి వచించిన నేగఁబోకు మీ
వరుష్టు వశించి పోవు వెల
భామల గూడకు వైరి చిత్తమా !

ఉ. కాసుల నిచ్చు నప్పుడు వి
కాసము మోమునఁ జూపియెన్ని యో
బాసలుజేసి యప్పటికి
బ్రహ్మ పథంబును చుట్టజేయు నా
కాసుల నీయకున్న తన
కాళ్లను బట్టిన జేరనీయకా
యాసలు మానుకొమ్ము మన
మా వెలకాంతలఁ గోరబోకుమా !

చ. ధనమును సర్వ భూషలును
తండ్రిగడించిన భాగ్యమంతయున్
ధనపతి పాలు కాఁ బసి త
నంబున నుండి గడించు పద్యశం
బనయము గంగపాలు తను
వంతయు రోగము పాలు జీవనా
లిన సుతు పాలు పిల్లలును

నింపియుఁ బంచలపాలు కావునన్
మనకవి యేల వద్దు వెల
భామల గూడకు వెర్రి చిత్తమా !

చ. వెల లలనా శిరోమణుల
వేసి వరింతురు పామరాళి యా
చెలియలు మోస పుత్తురని
చిత్తమునం దరయంగ లేరు ని
ప్పుల నడుమన్ బదంబిడిన
పోలిక గాదె తలంచి చూడ రో
వెలములపొత్తు ? యో మనమ !
బేరఁపు చానను గూడఁ బోకుమా !

ఉ. ఇంటను సద్గుణాఢ్యయగు
నింతి రతీసమదేహయుండఁగా
తుంటరివై ధనాంగనల
తోడను గూడుట యేల ? కెంచు వా
రింటను పాలు నన్నమును
నెంత యొసంగినఁ గాని యావలన్
పెంటలుఁదిన్న కుక్కగతి
వెట్టి గుణంబులు మానుచిత్తమా !

చ. పకపక నవ్వె యో సఖుఁడ!
భావభవ్రోపమ! రాజసుందరా!
వికచ పయోజనేత్ర రణ
వీర! మహారథ వైరి భంజనా
యికమము నేలుమా యనుచు
నింపుగ వేశ్యలు కైతఁ జెప్ప నా
సకియలఁ గూడ నెంచెదవు
చాలును జాలును వెఱ్ఱి చిత్తమా!

ఉ. లోకమునందు మానవులు
లోలతచే వెల సుందరాంగులన్
సాకుదు రింట నుంచుకొని
సాధ్వికులాంగన జూచు చుండఁగా
నీ కరణిన్ సతీతిలక
మింకొకనిన్ గలియన్ సహింతురే
చీకు దనంబుమాని వెల
చేడెల గూడకు వెఱ్ఱి చిత్తమా!

ఉ. మంజుల వాక్సుధాఝరి స
మస్తముగోరిలుచు వీణమీటుచున్
రంజిలి మేని మేలిమి ఘలా

రంగును గాంచి కరంబు పొంగి యా
లంజరమె భాగ్యదేవత యి
లాస్థలినంచును దాని మాయల
న్పంజరమందుఁ జిక్కకు మాపా
యము గల్గును మూఢ చిత్తమా !

ఉ. ఏమి ? కులాంగన న్విడచి
యీగతి వేశ్యల పైకి నేగెదా ?
కాముని కేళిగూడ కుల
కామిని చాలదొ ? వారకాంతలం
దేమి విశేషముండు భువి
నింతుల కందరి కొక్కతీరె కా ?
యేమి విశేష మన్న, వెల
యింతి నశింపఁగఁజేయు నింతె యా
పామర బుద్ధులేల వెల
భామల గూడకు వెర్రి చిత్తమా !

చ. గళమునఁ దాళి గట్టినది
గాదె సతీమణి ? యగ్నిసాక్షిగా
లలననుఁ బెండ్లియాడుతరి
లాతి సఖిన్ గననంచు బల్కవే

శ్యాల నీవుడేలఁ గోరుట ల
హా యది ధర్మమో? చాలుచాలు నీ
పలువ తనంబుమాని వెల
భామల గూడకు—

౬. మేని పొంకరిగుఁ జూచి సతి
మేలు మొగంబును గాంచి సన్మనో
కానుముఁగాంచి చంద్రసరి
గాంచిన చన్గవ సౌరుఁజూచి రో
చానను గూడకుండు సర
జన్మ మదేటి కటంచు నారి యా
మానిని తోడఁగూడి కల
మాన్యము దానికి ధారఁబోసి నీ
మానముఁ గంగఁగల్పకు సుమా
మనమా! వెలకాంత వీడుమా!

౭. కన్నులు మూసి మేల వెల
కామిని పైకి సవారు బోయెదా
పన్నగ వేణులన్ గలయు
వారొక రేనియు హెచ్చినా కనీ
కన్న సమర్థులే తనువు

గాయములై చెడిపోయి యేడ్పులో
నోర్వఁగరాని బాధపడి
ఘొల్లని తిట్టుల నాలకించుటల్
కన్నులఁ జూడలేదె? యిది
కాదు సుబుద్ధుల రీతి చిత్తమా!

ఉ. గాయములై శరీరములు
కమ్మలధారల గారుచుండగా
హేయపు వాసనల్ వెడల
నెల్లరు మోమున ముష్టి వైవ మొ
రోయని యేడ్చుచుండి యిఁక
రో వెలఁదిన్ గనఁబోదటన్న వా
రియిల నెందరుండిరో యొయి
కించుక గన్నుల నెత్తి చూడు మీ
దాయుకఁ బోయినీవు నగ
వాట్లను బొందకు వెర్రి చిత్తమా!

చ. కులసతి పుత్రుల న్వదుక
కూళ యటంచును తోడివారలున్
జులకనజేసి చూడఁ బ్రియ
సోదరవర్గము మోదజూడ నిం

దల బడి పోతి మెట్టులని
తల్లియుఁ దండ్రియు గుంపు చుండవే
శ్యలఁ గలియన్ రవంతయును
సౌఖ్యము గల్గదు సర్వ మీవు లో
పలఁ దలపోసి చూచి వెల
భామల గూడకు—

ఉ. పేడలు మిద్దె లమ్ముకొని
మిక్కిలియు న్నిరుపేద వారలై
కూడును గుడ్డ లేక పెర
కొంపలకున్ జని ముష్టి నెత్తుటల్
జూడఁగ లేదె ? జూడనిది
సొంపని తోచెనె? చాలుఁ జాలు నీ
పాడు గుణంబు మాని వెల
భామల గూడకు—

చే. ఇరువురు జారు లొక్క వెల
యింతినిఁ గూడఁగ నెంచి వేరుగా
చెరియొక ప్రక్కనుండి చని
చేడెను జేరఁగ ముష్టి యుద్ధముల్
జరిపి యనేకులొ పోటులు

చచ్చి రటించుచును వింట లేదె? యా
తెరువున బోక బుద్ధిగాని
లిప్సఁగ నుండుము వెర్రిచిత్తమా!

వ. వెలచెలితోడఁ గూడి కల
విత్తము దానికి ధార బోసె నీ
తలువ యటఁన్న చాలదె బు
ధుల, మరి తొంబది దిట్టనేల? ఛీ
కులసతియందు నీకుఁ గల
కోర్కెను దీర్చు కొనంగ నెవ్వరుం
బలుకఁగ లేరు గాదె మన
మా వెలకాంతలఁ గోరఁ బోకుమా

చ. ఘనసతి నుంచుటే మిగుల
తప్పుగదా? యది పెండ్లిలోనికిన్
జనగనె దాను నేగె యిది
నాప్రియ యంచనఁ బెద్దతప్పు నీ
కనక నిభాంగి గజ్జెను
గట్టుడు నాడు ననుజ్ఞ లేక యం
చనికడు ప్రజ్ఞఁబల్కె నది
యన్నెఁటికంటెను పెద్దతప్పు త

ప్పని యిది మంచి యంచు నిది
యాత్మఁ దలంపుము వెర్రి చిత్తమా!

ఉ. సారస పుష్పముఖ్య సుమ
సంఘమదుండఁగ భృంగమేగి బల్
వైరము గల్గు చంపకము
పజ్జ శ్రమింపను రీతి స్వీయమౌ
నీరజ నేత్రి జాయ మన
నీడవలెన్ జరియించు చుండఁగా
వార విలాసినీ మణుల
వెకుపకన్ దలఁపేలఁ చిత్తమా!

చ. ననువిడనాడి యొక్క వెల
నారిని గూడెను నా ప్రియుండు నా
మనవి దృణీకరించి యని
మానిని! భార్య విచార మొందగా
ధనసతితోడ గూడుటలు
ధర్మముగాదు సుమీ! యెటైన నా
మనవిని నాలకించి వెల
మానిని గూడకు వెర్రి చిత్తమా!

సీ. పడపుఁ జేడెలఁగూడి ♦ నడచు చుండుట మేలో
కులకామినిని వీడ ♦ కుంట మేలో
వెలకాంతలనుఁ గూడి ♦ కులుకుచుండుట మేలో
బుధులు పోయినదారిఁ ♦ బోవ మేలో
ధనకామినులఁగూడి ♦ తనరుచుండుట మేలో
పదిమందిచే దిట్లు ♦ పడుట మేలో
గుత్తకాంతల కెల్ల ♦ విత్తమిచ్చుట మేలో
తిరిపమెత్తుచు సదా ♦ తిరుగ మేలో

గీ. యెంచిచూడుమి యిదియెల్ల ♦ నించుకంత
గుత్తకాంతలఁ గూడుటే ♦ గొప్పగాదు
బుధులు వలదన్న త్రోవలఁ ♦ బోవరాదు
మంచి చెడుగుల మదిని యో ♦ జించు మనమ!

5. ముష్టియెత్తుట తప్పి ♦ పోవనేరదు గదా
వారకాంతల పొందుఁ ♦ గోరనేల
సద్గుణుం డని బుధుల్ ♦ సన్నుతింపరు గదా
వారకాంతల పొందు ♦ గోరనేల
మర్యాద విడనాడి ♦ పరుగు వారును గదా
వారకాంతల పొందుఁ ♦ గోరనేల
నపకీర్తి ప్రబలి వె ♦ న్నంటి వచ్చును గదా

వారకాంతల పొందుఁ • గోరనేల

గీ. యెన్నిసారులుఁ జెప్పిన • నించుకైన
జ్ఞానమెరుఁగవ యింత యూఁ • గడ మదేల
తప్పు ముమ్మాటికిని తప్పు • తప్పు తప్పు
వారకాంతలఁ గూడకు • పాడు మనసు.

సీ. సందు గొందుల వెంట • సంచరింపఁగ నేల
పరులను గని యుల్కి • పడఁగ నేల
మూర్ఖత చే సదా • మొంచిగోడలు దాటి
పైజారు దెబ్బల • బడఁగ నేల
అర్ధరాత్రంబున • నరుగుచో జనులెల్లఁ
జోరుఁ డనఁగ డంకి • వారనేల
తుంట రీతఁడని • కొంటెవారలు చేరి
నొవ్వఁగా రాలచే • రువ్వనేల

గీ. వారకాంతలకై బోవు • వారల కివి
తప్పు మన్నను కలనైన • దప్పి పోవు
మదము బట్టిన మహిమంబు • మాడ్కి నీవు
వారకాంతలకై బోకు • పాడు మనసా.

సీ. శృంగారముగ నొప్పు ♦ బంగారు భూషలు
యిచ్చి నన్నేల్లైకా ♦ యిచ్చకములు
పైనైన మేల్పట్టు ♦ చీరలు దండిగా
యిచ్చి నన్నేల్లైకా ♦ యిచ్చకములు
వన్నె చిన్నెలు గల్గి ♦ యున్న రైకలఁ దెచ్చి
నిచ్చి నన్నేల్లైకా ♦ యిచ్చకములు
పలు రంగులన్ గుల్కు ♦ విలువైన లంగాలు
నిచ్చి నన్నేల్లైకా ♦ యిచ్చకములు

గీ. హెచ్చురూకలు నిచ్చిన ♦ నిచ్చకములు
నెన్ని యేనియుఁ జూపుచు ♦ నీయ కున్న
కుక్కలను బోలె వెడలంగఁ ♦ గొట్టు గాదె
ప్రేమ గల్గునె చిత్తమా! ♦ విత్త సతికి.

సీ. మంజుల దరహాస ♦ పుంజము లొప్పఁ జల్లి
పసమీర కైదండ ♦ నొసఁగు దాని
గబ్బి గుబ్బల జిగి ♦ గనబడ గనకుండ
మించు ప్రేమను గాఁగ ♦ లించు దాని
కరకంకణముల ని ♦ క్వాణము రహిగప్ప
చిరుచిరు మసితముల్ ♦ సేయు దాని
ముద్దు ముద్దుగఁ బాద ♦ ములఁ బసి యొసఁ బ్రేమ

హత్తించి హాయిగా నొత్తుదాని

గీ. మోము మోమునఁ గదియించి ముచ్చటలతో
వన్నె రాచిల్క పల్కులు పల్కు దాని
ఏడి పరకాంత తోడను గూడెనేని
చింబి చెండాడ వలె నట్టి చెనఁటి జనుని

—విటకంఠపాశము—

సంపూర్ణము

